

# శ్రీ రమాపరిణయము

## ద్విపద కావ్యము

మాతృశ్రీ తరిగొండ వెంగమాంబ ప్రణీతము

పరిష్కర్త
ఆచార్య కె.జె. కృష్ణమూర్తి

ప్రచురణ
తిరుమల తిరుపతి దేవస్థానములు
తిరుపతి

# శ్రీరమా పరిణయము

## ద్విపద కావ్యము

## మాతృశ్రీ తరిగొండ వెంగమాంబ ప్రణీతము


సాధారణ సంపాదకుడు :

**బి.యస్. రెడ్డి (భూమన్)**

**సంచాలకుడు, తి.తి.దే. "శ్వేత", తిరుపతి**

పరిష్కర్త : ఆచార్య కె.జె. కృష్ణమూర్తి

తరిగొండ వెంగమాంబ వాఙ్మయ ప్రాజెక్ట్

తి.తి.దే. "శ్వేత" తిరుపతి



ప్రచురణ

**కార్యనిర్వహణాధికారి**

**తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి**

**2007**

ŚRĪ RĀMĀ PARIṆAYAMU

(DVIPADA KĀVYAMŪ)

MĀTṚŚRĪ TARIGOṆḌA VEṄGAMĀMBA

Edited by

**Prof. K.J. Krishnamoorthy**
Tarigoṇḍa Veṅgamāmba Vāṅmaya Project
"SVETA", T.T.D., TIRUPATI.

TTD "SVETA" Religious Publications Series No : 3



First Edition: 2007

Copies : 5000

Cover Design : **P. Srinivas**

Published by
**A.P.V.N. SARMA,** I.A.S.,
Executive Officer,
Tirumala Tirupati Devasthanams,
TIRUPATI - 517 507

DTP & Printed at
**Sri Parasarya Press**
Sri Vyasasramam
Ph: 08578-287528

# ముందుమాట

కలియుగదైవంగా ప్రశస్తిగాంచిన వేంకటరమణుని భక్తపరంపరలో ఒక్కొక్కరిది ఒక విశిష్టత. ఈ విశిష్టత ఆ యా భక్తులు శ్రీవారిని ఆరాధించటంలో అవలంబించిన మార్గాలవల్ల మనకు వెల్లడవుతూవుంటుంది. 'శ్రీవేంకటాచల మాహాత్మ్యం' వంటి సరస కావ్యాలను స్వామికి సమర్పించి తరించిన తరిగొండ వెంగమాంబ ఆ దేవ దేవుని భక్తబృందంలో అగ్రగణ్యయైన కవయిత్రీశిరోమణి!

ఈ 'కవితాతపస్విని' తిరుమల క్షేత్రంలో తపోవనం లాంటి ఒక తులసీ బృందావనాన్ని నెలకొల్పింది. ఆ 'బృందావనం'లో రాజయోగసాధనతో పాటు, వాఙ్మయ తపస్సు కావిస్తూ శ్రీనివాసునకు అంకితంగా అనేక కృతులను వెలువరించింది.

ఈ మహాకవయిత్రి రచించిన పదునెనిమిది కృతుల్లో చాలా భాగం అముద్రితంగా, సాహితీపరులకు అందుబాటులో లేనివిగా అజ్ఞాతంగా ఉంటున్నాయి. తిరుమలేశునికి మీదుకట్టి అవతరించిన ఈ రచనల నన్నిటిని ప్రచురించవలసిన ఆవశ్యకతను గుర్తించి తిరుమల తిరుపతి దేవస్థానం ఈ కవయిత్రి పేరట ఒక గ్రంథ పరిష్కరణ ప్రాజెక్టును నెలకొల్పింది. ఈ ప్రాజెక్టు నిర్వహణ బాధ్యతలను తి.తి.దే. "శ్వేత" సంస్థ సంచాలకులయిన శ్రీ 'భూమన్' గారికి అప్పగించింది.

ఉద్యమస్ఫూర్తి మేళవించిన ఉత్సాహపూరితులయిన "శ్వేత" సంచాలకులు శ్రీ 'భూమన్' గారు ఇటీవలే ఈ కవయిత్రి సారస్వతంపై ఒక జాతీయ సాహితీ సదస్సును విజయవంతంగా నిర్వహించటమే కాక, ఈ కవయిత్రి రచనల యందలి వేర్వేరు గీతాలకు ఆడియో సీ.డీ.లను తగిన గాయనీ గాయకులచే తయారు చేయిస్తుండటం మిగుల ముదావహమయిన విషయం.

హరికీర్తనాచార్యుడైన తాళ్లపాక అన్నమాచార్యుల జయంతి ఉత్సవాల లాగానే, ఈ కవయిత్రి యొక్క సాహితీ సమారాధనోత్సవాలను ఈమె జన్మదినమైన నృసింహుని జయంతి సందర్భంగా ప్రతి సంవత్సరం నిర్వహించడానికికూడా

తిరుమల తిరుపతి దేవస్థానం నిశ్చయించింది. ఇందులకు అనుగుణంగా మే 1వ తేదీన జరుపబోయే వెంగమాంబ జయంతి ఉత్సవ సందర్భంలో ఆవిష్కరించే నిమిత్తంగా ఈ క్రింది ప్రచురణలను చేపట్టి సిద్ధంచేస్తూవుండటం ఆహ్లాదదాయకంగా ఉంది.

1. తరిగొండ నృసింహాశతకము

2. శ్రీవేంకటేశ్వర కృష్ణమంజరి (స్తుతి కావ్యము)

3. రమా పరిణయము (ద్విపద కావ్యము)

4. బాలకృష్ణ నాటకము (యక్షగానము)

5. చెంచు నాటకము (యక్షగానము)

6. భక్తిగీత సుధాలహరి (వెంగమాంబ యక్షగానాల్లోని 108 గేయాల సంకలనం)

7. అష్టాంగయోగ సారము (పద్యకావ్యము)

ఈ ప్రచురణలన్నీ సహృదయ సాహితీ లోకాన్ని అలరింపజేయగలవని ఆశిస్తున్నాను.

ఇలాగే ఈ భక్త కవయిత్రియొక్క రచనలన్నీ శ్రీనివాసుని దివ్యానుగ్రహ విశేషంచేత అచిరకాలంలోనే చక్కని పీఠికలతో గూడిన సుపరిష్కృత రూపాలతో వెలుగుచూడగలవని ఆకాంక్షిస్తున్నాను.

తిరుపతి — ఎ.పి.వి.ఎన్. శర్మ

28, మార్చి 2007 — శ్రీకార్యనిర్వహణాధికారివర్యులు

తిరుమల తిరుపతి దేవస్థానములు.

# మనవి

తెలుగులో అన్నమయ్య తరువాత రాశిలోనూ, వాసిలోనూ విష్ణు సాహిత్యాన్ని విరివిగా అందించిన మహాకవయిత్రి మాతృశ్రీ తరిగొండ వెంగమాంబ. వెంగమాంబ 'తెలుగు మీరా'గా సుప్రసిద్ధురాలై, పోతనతో సాటియైన భక్తకవయిత్రిగా ప్రస్తుతింపబడింది.

శ్రీనివాసుణ్ణి రసరమ్యములైన కావ్యకుసుమాలతో పూజించి తరించిన సుమధుర సారస్వతమూర్తి తరిగొండ వెంగమాంబ. ఈ కవయిత్రి రచనలు శ్రీవేంకటేశ్వరుని సాహితీ మందిరంలో వెలిగించిన అఖండ దీపాలు. ఆ దీప కళికల కాంతులు ఈనాటికీ నిరంతరం ఆ తిరుమలేశుని దివ్య వైభవాన్ని అక్షరంగా ప్రకాశింపజేస్తున్నాయి.

తిరుపతికి పశ్చిమాన 100 కి.మీ. దూరంలో తరిగొండ గ్రామంలో ప్రభవించి, మధురకవితా సుధాధారలతో శ్రీ వేంకటేశుని అభిషేకించి తరించిన తెలుగు కవయిత్రి, అఖిలాంధ్ర జనయిత్రి తరిగొండ వెంగమాంబ.

సాంఘిక దురాచారాలపై సమరం ప్రకటించి, బాల వితంతువులపై ఆ నాడు జరిగే అన్యాయాలను ప్రతిఘటించి– తనకోసం కాదు– తనవంటి అభాగినులపై సంప్రదాయం పేరిట జరిగే అమానుష కృత్యాలను ఎదిరించి, తిరుగుబాటు బావుటా ఎగురవేసిన విప్లవవనిత వెంగమాంబ.

అనేకానేక ప్రక్రియలలో శతకాలు, యక్షగానాలు, ద్విపదలు, తత్త్వ సంబంధమయిన రచనలు, శ్రుతి, లయ సమన్వితములైన వేదాంతగీతాలు వెలయించటమేగాక, శ్రీ వేంకటాచలమాహాత్మ్యంవంటి బృహత్కావ్యములను రచించిన విదుషీమణి వెంగమాంబ.

శ్రీతరిగొండ వెంగమాంబ విశిష్ట వ్యక్తిత్వాన్ని పసిగట్టిన తిరుమల–తిరుపతి దేవస్థానం కార్యనిర్వహణాధికారి, గౌరవనీయులు, సంస్కారి శ్రీ ఏ.పి.వి.యన్.శర్మ గారు ఈ కవయిత్రి రచనలను పరిష్కరించి, ప్రచురించుటకుగాను

'తరిగొండ వెంగమాంబ వాఙ్మయప్రాజెక్టు'ను ఏర్పరచి అందుకు పరిష్కర్తగా శ్రీ కె.జె.కృష్ణమూర్తిగారిని నియమించినారు. ఆ ప్రాజెక్టు "శ్వేత" ఆధ్వర్యంలో పనిచేసేట్టుగా ఆదేశించినారు. స్వయాన సాహితీప్రియుణ్ణి అయిన నాకు తరిగొండ వెంగమాంబను గురించి తెలుసుకునే అవకాశం ఈ రకంగా కలిగింది. వెంటనే ఆమె సాహిత్యంమీద రెండు రోజులు జాతీయ సాహితీసదస్సు నిర్వహించటం, అనంతరం పుస్తక ముద్రణతో పాటు, ఆమె పాటలకు బాణీలు కూర్పించి, ఆడియో సి.డి.లుగా విడుదల చేయటానికి పూనుకున్నాను. తిరుమల–తిరుపతి దేవస్థానముల చరిత్రలో మొట్టమొదటి సారిగా ఆమె జన్మదినం సందర్భంగా రెండు రోజులపాటు సంగీత, సాహిత్య కార్యక్రమాలు నిర్వహించతలపెట్టినాను. అతి త్వరలో అన్ని పుస్తకాల ముద్రణ, పాటల ఆడియో సి.డి.ల విడుదల పూర్తి చెయ్యాలనే పట్టుదలతో ఉన్నాము.

ఈ బృహత్ కార్యక్రమము సఫలీకృతం కావటానికి పూర్తి కారకులు శ్రీ ఏ.పి.వి.యన్.శర్మగారు; మా ప్రియతమ కార్యనిర్వహణాధికారి. వారికి తెలుగు సాహితీ, సంగీత ప్రియుల పక్షాన ధన్యవాదాలు.

*బి. యస్. రెడ్డి*
సంచాలకులు
"శ్వేత"

# పీఠిక

## 1. కథా సంగ్రహం:

శ్రీమన్నారాయణుడు యోగనిద్రలో ఉండగా, బ్రహ్మాదిదేవతలు వెళ్లి, ప్రార్థిస్తారు. విష్ణువు మేలుకాంచి, 'వారలు వచ్చిన కారణమే'మని అడుగుతాడు. 'మిమ్ములను పతిగా పడయదలంచి తపస్సు గావించి, అవతరించిన జలరాశిపట్టిని పరిణయమాడవలసిం'దని వాళ్లు అభ్యర్థిస్తారు.

వారల కోరికను అనుసరించి విష్ణువు వేంకటాద్రిపై వేంకటేశ్వరుడనే పేర నెలకొంటాడు; తదనంతరం లగ్నం నిశ్చయించుకొని వచ్చేందుకు బ్రహ్మాదులను క్షీరసాగరునివద్దకు పంపిస్తాడు. సముద్రుడు సంతోషంతో సుముహూర్తాన్ని నిశ్చయించి, సమ్మానపూర్వకంగా వాళ్లను సాగనంపుతాడు.

అనంతరం శ్రీ వేంకటేశ్వరుడు గరుడవాహనాన్ని అధిరోహించి, సపరివారంగా సముద్రుని చెంతకు వేంచేస్తాడు. వరపూజ,పేరంటములు, మంగళస్నానం, స్నాతకవ్రతం, కాశీయాత్ర – అయిన పిమ్మట, కశ్యపుని ఆధ్వర్యంలో కల్యాణవేదికమీద రమాదేవీ వేంకటేశ్వరులకు ఎంతో వైభవంగా వివాహం జరుగుతుంది. నాల్గవనాటి రాత్రి బువ్వంబంతి. భోజనానంతరం పెండ్లికొడుకు బంగారు కలశాన్ని దొంగిలించి వేఱొక విడిదిని చేరుకుంటాడు. పెండ్లికూతురు వచ్చి, పూజించి ప్రార్థింపగా ఆయన అలుక మానుకుంటాడు.

వేంకటేశ్వరుడు అత్తమామలను, బంధువులను వేంకటాద్రికి ఆహ్వానిస్తాడు. తిరుమలలో విందులు, వినోదాలు పూర్తియైన పిదప, సాగరుడు వకుళాదేవియొక్క అభిప్రాయానుసారం కూతురును అల్లుని యింటిలోనే విడిచి, సకుటుంబంగా తన నివాసానికి తరలిపోతాడు. శ్రీ వేంకటరమణుడు రమాసతిని అలమేల్‌మంగ అనే అభిధానంతో తన వక్షఃస్థలంపై ధరించి సలలిత లీలలతో ఆనందనిలయంలో సుఖిస్తూవుంటాడు.

## 2. ఆధారం:

శ్రీమన్నారాయణుడు సముద్రుని కూతురైన లక్ష్మీదేవిని పరిణయమాడిన ఇతివృత్తం భాగవతం అష్టమస్కంధంలో ఉంది. దేవతలు, రాక్షసులు అమృతం నిమిత్తమై క్షీరసాగరాన్ని మథిస్తూవుండగా ఆవిర్భవించిన ఆదిలక్ష్మి శ్రీమహావిష్ణువును స్వయంగా వరించినట్లు అందులో చెప్పబడివుంది. వెంగమాంబ ఆ ఐతిహ్యాన్ని స్వీకరింపక, విష్ణువు లక్ష్మిని వివాహమైన పౌరాణిక సత్యాన్ని మాత్రమే అందుండి స్వీకరించి, దానిని వేంకటాచల మాహాత్మ్యాంతర్గత భవిష్యోత్తరపురాణ భాగమందలి పద్మావతీ వేంకటేశ్వర కల్యాణగాథయొక్క చాయలలో పరికల్పించింది. ఈ ద్విపద కావ్యమందలి కల్పనలలో శ్రీమహావిష్ణుని అవతారమేయైన శ్రీనివాసుడు వరుడయి ఉండటం – అనేది అత్యంత ప్రధానమైనది. ఈ మార్పు ద్వారా కవయిత్రి తన యిష్టదైవమైన వేంకటేశ్వరుని కల్యాణాన్ని మనోజ్ఞంగా వర్ణించి తనిసింది.

## 3. పాత్ర చిత్రణ:

కేవలం నాలుగువందల ద్విపదలలో రచింపబడిన లఘుకృతియైనా, ఈ కమనీయ కావ్యంలో పాత్రల బాహుళ్యం చోటు చేసికొని వుండటం ఇందలి విశిష్టత. ఈ కావ్యకథాగమనానికి కారణాలుగా వెలసివున్న పాత్రల్లో బ్రహ్మాది దేవతలు, వధూవరులయిన రమా వేంకటేశ్వరులు, కన్యాదాత యగు సాగరుడు, ప్రముఖ బంధువులయిన పార్వతీ పరమేశ్వరులు, వరుని పెంపుడు తల్లియైన వకుళమాలికాదేవి ముఖ్యమైనవారు. పరిమితిలో చిన్నదైనా, ఈ కృతిలో – అల్పాక్షరముల అనల్పార్థచనగా– ఆ యా పాత్రల స్వరూప, స్వభావాలను సుస్పష్టరేఖలతో ఆవిష్కరించటంలో ఈ కవయిత్రి పాటించిన పద్ధతు లివి:

i) దివ్యపాత్రములకు అదివ్యాలైన (మనుష్యోచితాలైన) భావాలను మురిపంగా ఆరోపింపజేయటం.

ii) ప్రతిపాత్రయొక్క స్వరూప, స్వభావాలను వారి పలుకుల ద్వారాను, చేష్టల మూలంగాను సమున్మీలింపచేయటం.

ఇందుకు ఒకటి, రెండు ఉదాహరణలు: అ) పెండ్లియైన అనంతరం సాగిన బువ్వంబంతిలో పరమశివుడు వరుణ్ణి పరిహసింపగా, పార్వతీదేవి వరుణ్ణి (వేంకటరమణున్ని) సమర్థిస్తూ, వధువును మేలమాడుతుంది. ఆ సన్నివేశంలో సాగిన ఆ ఆదిమ దంపతుల మనోజ్ఞసంభాషణ తిలకింప దగివుంది (చూ. 448-461 పంక్తులు).

తన సోదరుడైన శ్రీవేంకటేశ్వరుణ్ణి పరిహసిస్తూవున్న భర్తయొక్క అభిప్రాయాన్ని 'స్వామీ! మా జలజాక్షు సంపద తెలిసికూడా,ఈ మాడ్కి మీరంటే ఏమి చెప్పుదును?'- అని సుకుమారంగా నిరాకరించిన ఆ పరమేశ్వరియొక్క పల్కుల్లో వెల్లడౌతున్న వినయపురస్సరమైన సంయమనం ఆమెయొక్క ఉత్తమగృహిణీత్వాన్ని చక్కగా చాటుతూవుంది. అలాగే, తన చెల్లెలైన రమాదేవిని మేలమాడినందుకు శంకరుడు తెచ్చిపెట్టుకొన్న కోపంతో నవ్వుటాలకు పార్వతిని 'చెంప లదరవేస్తాను'- అని అనటంలో వ్యక్తమౌతూ వున్న ఆప్యాయత సహృదయ హృదయైకవేద్యం. పై పంక్తుల్లో పార్వతీ పరమేశ్వరులు బంధు ప్రియత్వం, అన్యోన్యత, లోకానుభవం - మొదలైన మానవోచిత గుణాలు గల ఉత్తమ దంపతులుగా చిత్రింపబడినారు!

ఆ) గంగ, యమున - మొదలయిన సముద్రుని పత్నులు వధువును వరుని విడిదికి పిలుచుకొని వెళ్లి, ఆమెచేత వేంకటేశ్వరుణ్ణి పిలిపించే సన్నివేశం మఱియొక మంజులోదాహరణ:

"విహితంబుగా నాది విష్ణుదేవునకు- రహిని సర్వోపచారములు చేయించి,
'పిలువు నీ పతి'నని ప్రేరేపఁ,దాను- కిలికించితాపాంగ కించిదానమిత
యగుచు నాయకుని మో మల్లనఁ జూచి - వగఁగుల్కఁ బిలిచె నవ్వనిత యిట్లనుచు"
540-545 పంక్తులు

నూత్నవధువగుటవల్ల రమాదేవి లజ్జావతి; ఐనా పతియెడల ప్రేమ, గౌరవాలు కలదవటంచేత ఆయన్ను చూడాలనే ఇచ్ఛ కలది. ఈ లజ్జా, ప్రేమ, గౌరవ భావాలు మూడూ ముప్పిరి గొన్న హృదయంతో ఆయనను ఆహ్వానిస్తూవున్న నాయికయొక్క ముగ్ధమోహన వినమిత వదనసౌందర్యాన్నీ, ఆ 'పలుకుతేనెలతల్లి' పలుకరించటంలోని సొబగునూ వెంగమాంబ "కిలికించితాపాంగ కించిదానమిత యగుచు, నాయకుని మో మల్లనఁ జూచి, వగఁగుల్కఁ బిలిచె"- అని కేవలం రెండున్నర ద్విపద పంక్తుల్లో సాక్షాత్కరింపజేసింది! 'అల్పాక్షరముల అనల్పార్థరచన' కు ఇది యొక చక్కని ఉదాహృతి! ఈ తీరుగా ఈ కావ్యంలోని పాత్రలు అన్నీ స్మితపూర్వభాషలతో, సుస్పష్టరేఖలతో విలసిల్లుతున్నాయి.

## 4. సంభాషణలు:

ఈ లఘుకృతి సరసములూ, ఆహ్లాదకరములూ అయిన సంభాషణలకు ఉనికిపట్టై విలసిల్లుతూవుంది.. "బువ్వంబంతి ఘట్టం" ఇందుకు ప్రకృష్టమైన ఉదాహరణం. ఈ ఘట్టంలో శంకరుడు పెండ్లి కుమారుణ్ణి, ఆ పెండ్లికొడుకు శంకరుణ్ణి, పార్వతి పెండ్లికూతురును, యమున పార్వతిని, పార్వతి యమునను, శంకరుడు పార్వతీదేవిని - భోజనవేళ చమత్కారోక్తులతో పరస్పరం పరిహసించటం మిగుల సుకుమారంగా, సముచితంగా సాగింది. మొత్తం కావ్యంలో మూడవవంతు (ఇంచుమించు నూటనలువది ద్విపదలు)గా విస్తరించివున్న ఈ రమణీయ ఘట్టంనుండి ఈ క్రింది సన్నివేశాలు ముఖ్యంగా పరికింపదగివున్నాయి:

i). బువ్వంబంతిలో శివుడు తన భుక్తశేషాన్ని వేంకటేశ్వరుని పళ్లెరంలో వేసినప్పుడు ఆ యిద్దరిక్కి సాగిన సరస సంభాషణ ఒక కమనీయోదాహృతి. (చూ. 322-345 పంక్తులు).

ii). పార్వతీదేవి పెండ్లికూతురును పరియాచకమాడే సన్నివేశం రమణీయమైన ఉదాహరణ. (చూ. 350-388 పంక్తులు).

పైని పేర్కొన్న సంభాషణలేగాక, ఈ ద్విపద కృతిలో మఱి కొందరి మనోజ్ఞ భాషణలు కూడా వున్నాయి. వాటిలో బ్రహ్మాదులు - శ్రీమన్నారాయణుడు, సముద్రుడు-బ్రహ్మాది దేవతలు- వీళ్ల పరస్పర సంభాషణలు, రమాసతి, వేంకటరమణుడు, వకుళాదేవి, సముద్రుడు- మొదలైన పాత్రలు ఆ యా సందర్భాల్లో పల్కిన పల్కులు- ఇత్యాదులు ముఖ్యమైనవి. వీటన్నింటివల్ల ఈ కావ్యం మొదటినుండి చివరిదాకా నాటకీయతా గుణమహితమై పఠితల, శ్రోతల మనోవీథుల్లో ఒక చక్కని చలనచిత్రంలాగా భాసిల్లుతుంది.

## 5. వర్ణనలు:

ఈ కావ్యంలోని కొలది వర్ణనల్లో ప్రధానంగా పేర్కొనదగినది రమా వేంకటేశ్వరుల కల్యాణం. ఇది ఇంచుమించు నలువది ద్విపదల్లో సంగ్రహంగా, సముచితంగా వర్ణింపబడివుంది. (చూ. 179-227 పంక్తులు). ఈ వర్ణనలో పేరంటంపిలుపులు, పెండ్లి ఏర్పాట్లు, పుణ్యాహవాచనం, స్నాతకవ్రతం, కాశీయాత్ర, కన్యాదానం, పాణిగ్రహణం, మంగళసూత్ర ధారణ, తలంబ్రాలు, లాజహోమాదులు- మొదలయిన వివాహాంగాలు అన్నీ నాణ్యంగా, నాజూకుగా, తెనుగుదనం ఉట్టిపడేలాగున వర్ణింపబడి వున్నాయి.

దీని తరువాతిది బువ్వంబంతివర్ణన. ఇది ఇంతకు ముందు తెల్పిన రీతిగా ఈ కృతిలో మూడవవంతుకు విస్తరించివుంది. ఇందువల్లనే ఈ పరిణయ కావ్యానికి "వేంకటేశ్వరుల బువ్వంబంతి"- అనే నామాంతరం కూడ ప్రచారంపొందింది. ఈ ప్రచారం ఈ వర్ణనకు గల ప్రాశస్త్యాన్ని చాటుతూవున్నది. మచ్చుకుగా ఈ బువ్వంబంతి వర్ణనలోని దశావతారవర్ణన -శంకరుడు పెండ్లికుమారుణ్ణి మేలమాడే నెపంతో ఆయనయొక్క పది అవతారాలను పేర్కొన్న సన్నివేశం-ముఖ్యంగా పరికింపదగివుంది. (చూ. 256-282 పంక్తులు).

అసలు, ఈ కావ్యం అంతా నాయకుడయిన శ్రీవేంకటేశ్వరుని అభ్యుదయాన్ని ఆహ్లాదకరంగా వర్ణిస్తూవుండటం ద్వారా నాయకాభ్యుదయ వర్ణనాత్మకమై, ఈ కవయిత్రియొక్క వర్ణనా నైపుణ్యాన్ని విశిష్టంగా ప్రకటిస్తున్నది.

## 6. మఱొక విశేషం:

వెంగమాంబ ఈ కావ్యాన్ని తిరుమల క్షేత్రంలోని తాళ్లపాకవారి యింటి ప్రక్కన చేరిన అనంతరం రచించింది. కవయిత్రి దీనిని "పెండ్లిపాట"గా ద్విపద భాగవతంయొక్క అవతారికలో పేర్కొన్నది. ఈ రీతిగా కమనీయమైన శైలిలో స్వామివారి కల్యాణాన్ని "పెండ్లిపాట"గా రచించటంలో ఈ కవయిత్రికి తాళ్లపాక తిమ్మక్క (తిరుమలాంబ) రచించిన "సుభద్రా కల్యాణము" ప్రేరణను ప్రసాదించిందని అందులోని ఈ క్రింది పంక్తులు సాక్ష్యమిస్తున్నాయి.

**"అవనిలో తాళ్లపాకన్నయ్యగారి - తరుణి తిమ్మక చెప్పె తాను సుభద్ర కల్యాణమను పాట కడుమంచి తేట - పలుకుల, నీ పాట పాడినా,విన్న శ్రీహరి వారికి చేరువైయుండు"**- సుభద్రా కల్యాణము, 54వ పుట.

తిమ్మక్క తన కృతిని "సుభద్రకల్యాణమను పాట"- అన్నట్లే వెంగమాంబ తనకావ్యాన్ని "రమా పరిణయంబను పెండ్లిపాట" అని పేర్కొన్నది.

పై రీతిగా ఈ కవయిత్రి తాళ్లపాక తిమ్మక్క రచించిన సుభద్రా కల్యాణ మనే "కల్యాణపుపాట"చే స్ఫూర్తిని పొంది ఈ రమాపరిణయమనే "పెండ్లి పాట"ను సృజించినా, కమనీయకథాకల్పనచేతను, దేశీయ సంప్రదాయాలను సొంపుగా ప్రతిపాదించటంచేతను, చక్కని పలుకుబళ్లతో విలసిల్లే మనోహరమైన శైలీవిశేషం చేతను ఆంధ్రసారస్వతంలో వెలసివున్న వివిధ పరిణయకావ్యాల్లో ఈ కృతి విశిష్టమై, స్వతంత్రమై, చక్కని నృత్యరూపకంగా తీర్చి దిద్దటానికి అనుకూలించే చతురస్రశోభి (Symmetrical) యైన సుందరాకృతితో రాణిస్తూవుంది.

## 7. పరిష్కరణ:

ఈ ద్విపదకావ్యం పండిత ప్రభాకరులు కీ.శే. వేటూరి ప్రభాకరశాస్త్రి గారిచే "శ్రీవేంకటేశ్వర లఘుకృతులు" అనే స్తుత్యాత్మక సంకలన గ్రంథంలో చేర్పబడి తిరుమల తిరుపతి దేవస్థానములవారి శ్రీవేంకటేశ్వర ప్రాచ్య పరిశోధనశాల ద్వారా 1948లో ప్రచురింపబడింది.

ఇందులో చేర్పబడిన రమాపరిణయ కావ్యాన్ని పరిష్కరించడంలో వేటూరి వారికి ఆధారం R.No. 1057 (Paper)- అనే సంఖ్యగల వ్రాతప్రతి. ఈ వ్రాతప్రతి మదరాసు ప్రభుత్వ ప్రాచ్యలిఖిత గ్రంథాలయంలో ఉండింది. ఈ R.No. 1057 (Paper) వ్రాతప్రతికి మూలమైన వ్రాతప్రతి కీ.శే. మానవల్లి రామకృష్ణకవిగారి వద్ద ఉండింది. ఈ మూలవ్రాత ప్రతియొక్క వ్రాయసకాడు గరిడిమిట్ట గంగాధరప్ప. ఈయన తరిగొండ వెంగమాంబకు మునిమనుమడు. ఆమెకు దత్తుతో చేరిన దౌహిత్రుల

సంతతికి చెందినవాడు. ఈ మూలప్రతిని ఆతడు క్రీశ. 1897 అక్టోబరు 31వ తేదీన వ్రాసియున్నాడు. మానవల్లివారు సేకరించుకొనియుండిన ఈ మూలప్రతిని చూచి మదరాసు ప్రభుత్వ ప్రాచ్యలిఖిత గ్రంథాలయంలోని లేఖకులు 1935-36 ప్రాంతంలో R.No. 1057 (Paper)-అనే సంఖ్యగల వ్రాతప్రతిని తయారుచేసి యున్నారు.

పైన పేర్కొన్నవిధంగా ప్రభాకరశాస్త్రిగారిచే సమకూర్చబడి Sri Venkateswara Oriental Series No.16 గా 1948లో తొలుత ప్రచురింపబడ్డ "శ్రీవేంకటేశ్వర లఘుకృతులు" అనే సంకలన గ్రంథం తరువాత పెక్కుమారులు పునర్ముద్రణలు పొందుతూవచ్చింది. అయితే, అందులో చోటుచేసికొన్న అచ్చుతప్పులు, తదితర దోషాలు సవరణకు నోచుకోకుండానే యథాతథంగా ముద్రింపబడుతూ వచ్చింది.

తరిగొండ వెంగమాంబ రచనల్లో ఒకటైన ఈ కావ్యం ప్రత్యేకంగా ప్రచురితం కావటం ఇదే ప్రథమం. అందువల్ల ఈ పరిష్కరణంలో 1948 నాటి తొలిముద్రణ ప్రతిని R.No. 1057 (Paper) సంఖ్యగల వ్రాతప్రతితో మరల సరిపోల్చి పరిశీలించి, ఇందులో సముచితములైన సవరణలు చేయటం జరిగింది. ఈ పరిష్కరణలో ఆవశ్యకమైన ఆ యా విరామ చిహ్నాలను, అలాగే నూతనంగా కొన్ని ఉపశీర్షికలను (Sub headings) చేర్చటం జరిగింది. అట్లే, ఈ కృతియందలి ద్విపదపంక్తులకు పరిశోధకుల సౌకర్యార్థమై పదేసి పంక్తుల చొప్పున సంఖ్యానిర్దేశంకూడ చెయ్యబడింది.

తి.తి.దే. "శ్వేత" సంస్థ పక్షాన ప్రచురితమౌతూవున్న ఈ రమణీయ ద్విపదకావ్యం రసజ్ఞులకు ఆహ్లాదాన్ని ప్రసాదించ గలదని ఆశయము.

తిరుపతి ఉత్సవాల్లో మాతృశ్రీ తరిగొండ వెంగమాంబ సారస్వతాన్నిగూర్చి ఉపన్యసించే సదవకాశాన్ని కల్పించటం ద్వారా ఈ వాఙ్మయ పరిష్కరణ ప్రాజెక్టుకు మూలవిరాట్టుగా అంకురార్పణ కావించిన సహృదయవతంసులు తిరుమల తిరుపతి దేవస్థాన పాలకమండలి అధ్యక్షవర్యులు శ్రీ భూమన కరుణాకరరెడ్డి మహోదయులకు, తిరుమల తిరుపతి దేవస్థాన పాలకమండలి సభ్యులెల్లరకు నా అనేక హార్దిక ధన్యవాదములు.

మాతృశ్రీ తరిగొండ వెంగమాంబ వాఙ్మయ పరిష్కరణ ప్రాజెక్టు రూపొందటంలో మూలకారణులయిన సహృదయవతంసులు తిరుమల తిరుపతి దేవస్థాన శ్రీకార్యనిర్వహణాధికారివర్యులు, సుగృహీతనామధేయులు శ్రీ ఎ.పి.వి.ఎన్. శర్మ, ఐ.ఏ.యస్., మహోదయులకు నా అనేక హార్దిక ధన్యవాదములు.

తిరుమలలో సంయుక్త కార్యనిర్వహణాధికారి శ్రీ జి. బలరామయ్య, ఐ.ఏ.యస్.,గారు, తిరుపతిలో సంయుక్తకార్యనిర్వహణాధికారి శ్రీఎన్.శ్రీకాంత్, ఐ.ఏ.యస్.,గారు– ఈ ఉన్నతాధికారు లిరువురకు నా అనేక హార్దిక ధన్యవాదములు.

మాతృశ్రీ తరిగొండ వెంగమాంబ వాఙ్మయ పరిష్కరణ ప్రాజెక్టుయొక్క సర్వతోముఖమైన వికాసానికి తమ ఉద్యమస్ఫూర్తిని ప్రసాదించి, ఉత్సాహ, ప్రభుశక్తి పూరితమైన దక్షతతో ముందుకు నడిపిస్తూవున్న తి.తి.దే. "శ్వేత" సంస్థ సంచాలకులు, సహృదయవతంసులు, "భూమన్"గా సుగృహీత నామధేయు లయిన శ్రీ భూమన్ సుబ్రహ్మణ్యంరెడ్డి మహోదయులకు నా అనేక హార్దిక ధన్యవాదములు.

తి.తి.దే. పౌరసంబంధాధికారివర్యులు సరసహృదయులు శ్రీయుతులు కె.రామ్ పుల్లారెడ్డిగారికి నా అనేక హార్దిక కృతజ్ఞతాభివాదములు.

టి.టి.డి. "శ్వేత" కేంద్రగ్రంథాలయం లైబ్రేరియన్ సోదరీమణి శ్రీమతి ఎన్. లీలావతిగారికి, వారి సహోద్యోగులయిన మిత్రబృంద మందరికీ-

"శ్వేత" సంస్థ కార్యాలయం సూపరింటెంటెంట్ శ్రీ వి. దామోదరం గారికి, వారి సహోద్యోగిబృందమందరికీ, మిత్రుడు శ్రీ జి. సురేష్‌కుమార్ (యు.డి.సి) గారికి-

"శ్వేత" సంస్థ కో-ఆర్డినేటర్స్ శ్రీ పి. రమణారెడ్డిగారికి, మిత్రుడు డా॥ యన్.యస్. బాలాజీరావుగారికి, తదితర మిత్రులందరకూ-

నా అనేక హార్దిక కృతజ్ఞతాభినందనములు.

శ్రీవేంకటేశ్వర విశ్వవిద్యాలయ ప్రాచ్యపరిశోధనసంస్థ డైరెక్టర్ ఆచార్య వి. వేంకటరమణారెడ్డిగారికి, వారి సహోద్యోగులకు అనేక హార్దిక కృతజ్ఞతాభి నందనములు.

ఈ పుస్తకమును ముచ్చటగా ముద్రించిన శ్రీవ్యాసాశ్రమము (ఏర్పేడు) శ్రీపారాశర్య ముద్రణాలయము వారికి నా హార్దిక కృతజ్ఞతాభినందనములు.

మాతృశ్రీ తరిగొండవెంగమాంబాకవయిత్రియొక్క ఆరాధ్య దైవమయిన "శ్రీతరిగొండ శేషకుధరాధ్యక్షు"నకు నా భక్తిపూర్వక ప్రణామాంజలి.

--కె.జె. కృష్ణమూర్తి

# శ్రీరమా పరిణయము

## ద్విపద కావ్యము

### విషయ సూచిక

# శ్రీరమా పరిణయము

## ద్విపద కావ్యము

### ✳ ఇష్టదేవతా స్తుతి ✳

శ్రీ వేంకటేశ్వరుఁ - జిత్తమందుంచి
భావించి తరిగొండ - పతినిఁ బూజించి

శ్రీభారతిని, హయ-గ్రీవునిఁ దలఁచి
ప్రాభవంబున గురుఁ - బ్రస్తుతి చేసి

కరమర్థితో రమా - కల్యాణ సరణి
తెలుఁగొప్ప రచియింతు - ద్విపద కావ్యముగ

ఘనమైన తత్కథా - క్రమ మెట్టిదనిన
వినరయ్య కవులార! - విద్వాంసులార!

### ✳ నారాయణుని దేవతలు ప్రార్థించుట ✳

నారాయణుఁడు జగ-న్నాథుఁ దచ్యుతుఁడు
క్షీరవారిధియందు - శేషతల్పమున

యోగనిద్రారతి - నురుతరానంద
సాగరమగ్నుఁడై - శయనించియుండ

అపు దచ్చుటికి శంభుఁ, - దజుఁడు, దేవతలు,
తపసులు వచ్చి మో - దంబు దీపింప

ముకుళిత హస్తులై - ముందఱ నిలిచి
యకలంక భక్తి ని - ట్లనిరి వారెల్ల:

‘దేవదేవ! సమస్త – దేవతారాధ్య!
నీ వింక నీ యోగ – నిద్ర మేల్కొనవె!

పరమాత్మ! మమ్మెల్లఁ – బాలించుకొఱకు
నిరుపమంబగు యోగ – నిద్ర మేల్కొనవె!’

యనుచుఁ బ్రార్థింపఁగా – నాది విష్ణుండు
కనువిచ్చి యందఱిఁ – గలయ నీక్షించి

మందస్మితాస్యుఁడై – ‘మహితాత్ములార!
యెందుకు వచ్చితి? – రిచ్చోటి’ కనిన

‘పరమాత్మ! మీ దివ్య – పాదపద్మములు
సురుచిర భక్తితోఁ – జూడ వచ్చితిమి

మమ్ము మన్నించి, మా – మనవి పాలించి
సమ్మతంబుగ విను – సత్య సంకల్ప!

నిరత మిట్టే యోగ – నిద్ర నుండినను
శరణాగతుల నేలు – సరణి యెట్లగును?

సర్వజ్ఞుఁడవు, సర్వ – శక్తియుక్తుఁడవు,
నిర్వాణమయుఁడవు, – నిర్వికారుఁడవు

కావున నీ పాద – కమలద్వయంబు
భావించి నిన్నాత్మ – పతిఁగాఁ దలంచి

సహజమౌ నీశుద్ధ – సాత్త్విక కళయె
మహనీయ తపము స – మ్మతముగాఁ జేసి

పనిఁబూని జలరాశి – పట్టియై పుట్టి
ఒనర నిన్నే కోరు – చున్న దిచ్చోట
నీ వా మృగాక్షిఁ బా – ణిగ్రహణంబుఁ
గావింపవే నిత్య – కల్యాణ!' యనిన,
నవ్వుచుఁ దరిగొండ – నరహరి వేడ్క
నివ్వటిల్లఁగ వారి – నిం జూచి పలికె:

## ✳ నారాయణుని యనుగ్రహోక్తి ✳

'గరళకంధర, పద్మ – గర్భాదు లెల్ల
సరవిని వినుఁ డొక్క – సరణిఁ జెప్పెదను
భూలోకమున శేష – భూధరమందు
నే లీల దీపింప – నిలిచి, యచ్చోట
వేంకటేశ్వరుఁడన – విఖ్యాతిఁ బొంది
పొంకంబుగా నుందు – భూపాలు కరణి
మచ్చిక నలమేలు – మంగాభిధాన
మిచ్చి, సంప్రీతి నా – యిందిరాసతిని
నే శీఘ్రముగను పా – ణిగ్రహణంబుఁ
జేసెద'నని పల్కి, – చిఱునవ్వు నవ్వి
గుఱుతుగా వారి వీ – డ్కొని ముదం బెసఁగ

## ✳ శ్రీహరి వేంకటాద్రికి విచ్చేయుట ✳

పరమాత్ముఁ డందుండి - పయనమై వచ్చి
శ్రీ వరాహస్వామి -చేకొనియున్న
శ్రీ వేంకటాద్రిపైఁ- జేరి వేడుకను

అప్పుడు శ్రీవరా - హస్వామి నడిగి
తప్ప కా క్షేత్రంబు - తా నాక్రమించి

నలువొప్పఁ దరిగొండ - నరసింహుఁ డనఁగ
విలసిల్లుచుండె శ్రీ - వేంకటేశ్వరుఁడు.

## ✳ శ్రీహరి బ్రహ్మాదులను క్షీరాబ్ధికడకుఁ గన్య నడుగఁ బంపుట ✳

అంత నచ్చటికి బ్ర - హ్మాదులు వచ్చి
సంతోషచిత్తులై - చక్రి నీక్షించి

వేదాంత సూక్తుల - వినుతింప, నగుచు
నాదినారాయణుం - డట వారి కనియె:

'ఓ పంకజాసన! - యో ఫాలనయన!
యో పాకశాసన! - యో మౌనులార!

చెలఁగుచు మీరు వ - చ్చిన చంద మెల్లఁ
దెలిసెను, మీరింకఁ - దీవ్రంబుగాను

క్షీరవారిధిఁ జేరి - శ్రీరమాసతిని
నేరీతినైన నా - కిమ్మని యడిగి

నిరుపమ లగ్నంబు - నిర్ణయించుకొని
సరగున ర' మ్మన్న - సంతసంబంది

హరియాజ్ఞ వడసి వా - రరుగుచుండఁగను
పాల గరుడి దీర్చి - పచ్చని మ్రాని
పై లీలతో [1]మెట్టి - పట్టుగాఁ జూపె
అది మొదల్ శకునంబు - లతి దివ్యములుగ
మది కిష్టముగ నయ్యె - మార్గంబునందు.
అందుకు సంతోష - మధికంబు గాఁగ
నందఱా క్షీరాబ్ధి - కరిగిన, లేచి
వారికి నెదురుగా - వచ్చి సాగరుఁడు
కూరిమి మీఱఁ దో - డ్కొనివచ్చి నగుచు
మురియుచు మణిపీఠ - ముల మీఁద నుంచి
యిరవొందఁ బూజించి - యిట్లని పలికె :

## సముద్రుని సంప్రశ్నము ✳

'వరుసగాఁ బరమ పా - వనులార! నన్నుఁ
గరుణించి వచ్చిన - కార్యమే?' మనిన
విని, వారలంద ఱా - విమల మానసునిఁ
గనుఁగొని పలికి రు- త్కంఠ నిట్లనుచు :

## ✳ బ్రహ్మాదులు కన్య నడుగుట ✳

'వనరాశి! యొక శుభ - వార్తఁ జెప్పెదము
వినవయ్య! నీ వది - విశదంబుగాను

1. వెంట పట్టఁగాఁ జూపె - పూర్వముద్రిత పాఠము.

రహిమీఱ నాది నా - రాయణుం డిపుడు
మహియందు నత్యంత - మహిమ దీపింప
అరుదైన వేంకటే - శాఖి ధానమున
నెరసి శేషాద్రిపై - నిలిచియున్నాఁడు
అతనికి నీ పుత్రి - యగు రమాసతిని
హితమొప్ప నడుగ మే - మిటకు వచ్చితిమి'
అనిన, 'ధన్యుఁడనైతి' - నని సాగరుండు
మనమున నుప్పొంగి, - 'మధుసూదనునకు
నిచ్చెద మత్కన్య - నిపు' డన్న, వారు
మచ్చిక నతని స - న్మానంబుఁ జేసి,
లలితమైన వివాహ - లగ్న మేర్పఱచి,
జలరాశి యొసఁగిన - సకల వస్తువులు
చెలువొందఁ గైకొని - శేషాద్రిఁ జేరి
జలజాక్షునకు మ్రొక్కి - సరవి నిట్లనిరి :

## ✳ బ్రహ్మాదులు స్వామికి వివాహనిశ్చయ మెఱిఁగించుట ✳

'స్వామి! సాగరుఁడు శ్రీ - సతిని మీ కొసఁగఁ
గామింపుచున్నాడు- ఘన భక్తి మీఱ
నటుగాన మిమ్ము నె - య్యంబుతో నిపుడె
తటుకునఁ బెండ్లికిఁ - దరలి రమ్మనియె.'
అన విని తరిగొండ - హరి నవ్వి, వారిఁ
గనుఁగొని పల్కె ను - త్కంఠ దీపింప:

## ✳ పెండ్లి పయనము ✳

'పనిఁబూని శంకర - బ్రహ్మాదులార!
పెనుపొందఁగాను నా - పెండ్లికి మీరు

పరఁగ మీ మీ కుటుం - బంబులతోడ
సరగున ర'మ్మన్నఁ - జని వార లపుడు

తమతమ సతులతోఁ - దమ కుమారులతోఁ
దమ తమ పరివార - తతులతో మగిడి

వచ్చిన, వారితో - వరలగ్నమందు
హెచ్చుగా విహగేంద్రు - నెక్కి యచ్యుతుఁడు

సరవి ననంత, వి - ష్వక్సేన ముఖ్య
పరివారవితతి స - ద్భక్తితోఁ గొలువ

ముదమొప్ప విఖనస - ముఖ్య [2]సన్మునులు
విదితంబుగాఁ బరి - వేష్టించి పొగడ,

హర, విరించి, సురేశ్వ - రాదులు చెలఁగి
విరివిగాఁ బద్మాక్షు - వెనువెంటఁ జనఁగ

వరుసగా ఘనశుభ - వాద్యముల్ మొరయఁ
దఱుచైన మంగళ - ద్రవ్యాళితోడఁ

జని చని యాక్షీర - జలరాశి చెంత
ఘనముగా నిలిచె; నా - క్రమము సాగరుఁడు

---

2. సంయములు - పూర్వముద్రిత పాఠము.

## ✳ వరపూజ ✳

విని, తన పరివార - వితతులతోడఁ
దనరార శోభన - ద్రవ్యముల్ గొనుచు
దొరకొని మంగళ - తూర్యముల్ మొరయ
నరుదుగా దార పు - త్రాదుల తోడ
నలువొప్పఁ దరిగొండ - నరసింహుఁడైన
సలలిత వేంకటా - చల నివాసునకు
హెచ్చిన భక్తితో - నెదురుగా వచ్చి,
యచ్చుగాఁ దగు పూజ - లచటఁ గావించి,
అందుండి బ్రహ్మ,రు - ద్రాదులతోడ
పొందుగా హరి నాత్మ - పురమున కపుడు
తొడుకొని పోయి బం - ధుజనంబుతోడ
విడుదులలో నుంచె - వేడ్కతో నంత.
సహజ లీలలఁ బరి - చారకుల్ చెలఁగి
రహిమీఱఁ బచ్చతో- రణములతోడ
[3]మురువంపు ముత్యాల - ముగ్గులతోడ
దఱుచైన [4] వివిధ చి - త్తరువుల తోడఁ
గ్రమముగా నగరు శృం - గారంబు చేసి
విమలమౌ కల్యాణ - వేదిక నిండఁ

---

3. మురువొప్ప - పూర్వముద్రిత పాఠము
4. వింత చిత్తరువులతోడ - పూర్వ ముద్రిత పాఠము

దలకొని మంగళ - ద్రవ్యంబు లుంచి,
పెలుచ బంగరుపెండ్లి - పీఁటలు వెట్టి,
కరమొప్ప ముత్యాల - గద్దె లందుంచి,
పరువడి రత్నకం - బళములు పఱిచి,
హరి రాకఁ గోరఁగా - నప్పు డందుండి
వరరత్న భూషణా - వళు, లంబరములు
ధరియించి, తోడ ము - త్తైదువుల్ రాఁగ
గుఱుతుగా ముత్యాల - గొడుగుల నడుమ
ఘనతరంబుగ గంగ, - గౌతమి, యమున,
అనుపమ తుంగభ - ద్రాదులైనట్టి
వననిధి భార్యలు - వరవైభవమున
ననురాగమున శోభ - నాక్షతల్ గొనుచు
సలలిత వాద్యఘో - షంబులతోడ
వెలయఁగా హరియున్న - విడిదికి వచ్చి,
కమనీయ భక్తి నా - కమలలోచనుని
సముచిత క్రమములఁ - జాలఁ బూజించి,
రహిమీఱఁ గుసుమ - హారము కంఠమందు
విహితంబుగా నుంచి, - వేడ్క రెట్టింపఁ
దక్కినవారినిఁ - దగఁ బూజ చేసి,
మక్కువ దీపింప - మఱి యిట్లు లనిరి :

## ✳ పేరంటము పిలుపు ✳

'రయమున మా మంది - రమున కో గిరిజ!
ప్రియమొప్ప రావమ్మ! - పేరంటమునకు,

రామాలలామ! భా - రతి! నీవు వేగఁ
ప్రేమతో రావమ్మ! - పేరంటమునకు,

మునివధూమణులార! - ముచ్చటమీఱఁ
బెనుపొంద రారమ్మ! - పేరంటమునకు

సిరి నొప్పుచుండు శ - చీదేవి! నీవు
పెరిమెతో రావమ్మ! - పేరంటమునకుఁ,

దెఱఁగొప్పఁ దక్కిన - దిక్పాలసతులు!
మురిసి పేరంట మి - మ్ముగ మీరు రారె!

గరుడ, గంధర్వాది - కామినీ మణులు!
మెఱసి పేరంటంబు - మీరెల్ల రారె!'

అని వారు పేరంట - మందఱిఁ బిలువ

## ✳ పెండ్లి యేర్పాట్లు ✳

నొనర సాగర, సోము - లుచితక్రమముల

నచ్చట బ్రహ్మ, రు - ద్రాదులతోడ
మచ్చికతో నాత్మ - మందిరంబునకు

గొనకొని హరినిఁ దో - డ్కొనివచ్చి, యచట
మునుల సమ్మతమున - ముదము దీపింప,

భయభక్తు లెసఁగ నా - పంకజోదరునిఁ
బ్రియముమీఱ వివాహ - పీఠమందుంచి,

వలనొప్పఁ దక్కిన - వారి నందఱిని
నలువొప్ప విహితాస - నంబులం దుంచి,

విలసితమూర్తులై - వెలయు విశ్వేశ,
జలజాసనాదులు - సభికులుగాఁగ,

పరఁగ శ్రీ పార్వతీ - భారతీ ప్రముఖ
తరుణులు పెండ్లి ము - త్తైదువుల్గాఁగ,

వరుసగా నందు వి - వాహ కృత్యములు
పొరిఁబొరి నా కశ్య - పుఁడు నెఱవేర్ప,

మంగళస్నానాది - మహిత కృత్యములు
సాంగంబుగాఁ జేసి, - సకలోత్సవములు

నలువొప్పఁగాను పు - ణ్యాహవాచనము,
విలసిత స్నాతక, - వేద వ్రతములు

చేసి, కాశీయాత్ర - శ్రీహరి చనఁగ,
వాసిగాఁ దోయధి - వచ్చి ప్రార్థించి

'కపటనాటక! నీవు - [5]కాశి పోనేల?
ఇపుడ నా సుతను నీ - కిచ్చెద'ననుచు

మగుడి తోడ్కొనిపోయి - మందిరమందు
జగదీశ్వరుని నిల్పె - సంప్రీతి నపుడు.

---

5. కాశి కేఁగెదవె? - పూర్వముద్రిత పాఠము.

## ✳ స్వామి కల్యాణము ✳

అనుపమంబైన క - న్యావరణంబు
మునివరుల్ జరుపంగా, - మురిసి సాగరుండు

పనిఁబూని భక్తితోఁ - బంకజాక్షునకు
మనము రంజిల్లఁగా - మధుపర్క మిచ్చి,

నవ్య భూషణములు, - నవ్య వస్త్రములు,
దివ్య గంధంబులు, - దివ్యమాల్యములు

కమలాక్షునకు, రమా - కన్యకామణికిఁ
బ్రమదంబుతో సమ - ర్పణమొప్పఁ జేసి,

ఘనముగా నా రమా - కన్య నా హరికి
తన వధూయుక్తుఁడై - దానంబు చేసె.

కరమొప్ప నా రమా - కన్యకామణినిఁ
గరుణించి హరి కర - గ్రహణంబు చేసి,

నిరుపమంబగు దర - నిభకంఠమందు
సురుచిరమంగళ-సూత్రంబుఁ గట్టె;

సరసతమీఱ శ్రీ - సతిశిరంబందుఁ
దఱుచైన వేడ్కతోఁ - దలఁబ్రాలు వోసె;

జలజాక్షు శిరముపై - జలరాశి కన్య
పొలుపొందఁ దలఁబ్రాలు - పోసె; నీరీతి

నక్షత్రారోపణ - మ్మైన పిమ్మటను
లక్షణవతియైన - లక్ష్మితోఁగూడ

సలలిత వేంకటా - చల వాసుఁడనఁగ
నలువొప్పు తరిగొండ - నారసింహుండు

అలరుచు లాజహో - మాదికృత్యములు
వలనొప్ప వేర్వేఱ - వరుసగా నడపె.

## ✳ బువ్వము బంతి ✳

గురుతరంబుగ నాలు - గో నాటి రాత్రి
వరుసగా నిజబంధు - వర్గంబుతోడఁ

బొలుపొందఁ దరిగొండ - పురధాముఁ డనఁగ
విలసిల్లుచున్న శ్రీ - వేంకటేశ్వరుఁడు

అలమేలుమంగతో - ననురాగ మెసఁగ
సలలితమాణిక్య - సదనమధ్యమునఁ

బేరైన బంగారు - [6] పీఠము మీఁదఁ
గోరి బువ్వముబంతిఁ - గూర్చుండె, నపుడు

గణుతింపఁగా గంగ, - గౌతమి, యమున,
మణికర్ణికయును, న - ర్మద, తుంగభద్ర

మొదలైన జలరాశి - ముఖ్య కామినులు
సదమల చిత్తలై - సంతోష మెసఁగ

ఘలుఘల్లుమని కాళ్ల - గజ్జె, లందియలు
వలనొప్ప మ్రోయఁగా - వచ్చి వేడుకను

---

6. పీఁటలమీఁద - పూర్వ ముద్రిత పాఠము.

పరఁగ నచ్చుటఁ బైఁడి - పళ్లెరా లుంచి
గరిమతోఁ బాత్రాభి - ఘారంబుఁ జేసి,

బహువిధ భక్ష్యముల్, - పక్వ శాకములు,
విహిత దివ్యాన్నముల్, - వింత పచ్చళ్లు,

తఱుచైన ఘృతము, దు - గ్ధములు, తేనియలు,
పెరుఁ, గూరుగాయలు - ప్రియముగాఁ దెచ్చి,

వరుసగా వడ్డించి, - వాసించు జలము
కరమొప్పు [7]హాటక - కలశాల నిండ

నించి, యందుంచి; రా - నీరజోదరునిఁ
గాంచి నవ్వుచు నీల - కంఠుఁ డిట్లనియె :

## ✳ శంకర, శ్రీహరుల వావి పల్కులు ✳

'జలజాక్ష! నీవు మా - జలరాశి యింటఁ
గలుముల చెలి నిట్లు - గైకొన్న కతన

నసమాన సౌఖ్యంబు - లబ్బె నీ కిచటఁ
బొసఁగ నాఁకలి దీర - భుజియింపవోయి!

మీనరూపముఁ దాల్చి - మెండుగా జలము
పానంబుఁ జేసిన - ప్పటివలెఁ గాదు,

ఈ నిర్మలాన్నంబు - లిచ్చుట నీవు
పూని యాఁకలి దీర - భుజియింపవోయి!

పరఁగఁ దాఁబేలివై - స్వల్పజంతువుల
నరుదుగా భక్షించి - నటువలెఁ గాదు,

7. సౌవర్ణ కలశాళి నిండ - పూర్వ ముద్రిత పాఠము.

అలర నీ కుడుముల, -నతిరసంబులను
పొలుపొందఁ దృప్తిగా - భుజియింపవోయి!

దొరకొని పందివై - తుంగగడ్డలను
గరగర నమలిన - కైవడి గాదు,

కరిజకాయలు, వడల్, - గారె, లిడ్డెనలు
పొరిఁబొరి రుచులుగా - భుజియింపవోయి!

పూని నృసింహ రూ - పున దైత్యు రక్త
పానంబుఁ జేసిన - ప్పటి రీతి గాదు,

తెలివితో నిప్పుడు - తేనె పానకము
నలువొప్ప నీవు పా - నము చేయవోయి!

సలలితంబుగ బ్రహ్మ - చారివ్రతముల
నలసి యీ వఱకు, గృ - హస్థుఁడైనావు,

విమలాత్మ! నియమముల్ - విడిచి యీ వేళ
భ్రమదీర నన్నియు - భక్షింపవోయి!

లలిని బ్రహ్మర్షిత్వ - రాజఋషిత్వ
ములఁ గాయ, పండ్లు ని - మ్ముగ మెక్కి, దానఁ

దనియక వెన్న ము - ద్దలు మ్రుచ్చిలించి
తిని, దిగంబరుఁడవై - తిరిగిననాఁటి

బడలిక దీఱ నీ - పరమాన్నమెల్లఁ
దొడరి నీ వా చేర - తోఁ ద్రావవోయి!

కలికితనమున నాఁ - కలి దీరఁబోదు,
కులుకుతో నిపుడు సం - కోచింపవలదు,

భువి నెన్నఁదగు భక్ష్య - భోజ్యాదులైన
వివిధ పదార్థముల్ - వింతగా నిపుడు

ముజ్జగంబుల కాది - మూలమైనట్టి
బొజ్జనిండఁగ నీవు - భుజియింపవోయి!'

అన విని తరిగొండ - హరి నవ్వి, శివునిఁ
గని యిట్లు లనియె: 'బల్ - గారడంబుగను

## ✳ భుక్తశేష వినోదము - వితరణ ✳

పన్నగాభరణ! యీ - పగిది నా తప్పు
లెన్నెద, వెపుడు ని - న్నెఱుఁగనే? నేను

చక్కని పునుక కం - చంబు చేపట్టి
యెక్క డెక్కడ బిచ్చ - మెత్తినఁగాని

ఆఁకలి దీరక - యలనాఁడు విషము
గైకొని మెక్కిన - క్రైవడి గాదు

ఇప్పు డీ దివ్యాన్న - మిష్టంబుగాను
మెప్పుగా భుజియింపు - మేము చూడఁగను,

మును నీవు ఘన భూత - ముల సంహరించి
తనరార మెక్కి, యెం - తటనైనఁగాని

పరితృప్తిఁ జెందక, - పావనుండైన
చిరుతొండ భక్తుని - శిశువు మాంసంబు

భక్షించినటు గాదు, - బహురుచుల్ గాను
భక్షించు మిప్పుడీ - భక్ష్యంబులన్ని,
అనలునిఁ గంటిలో - నణఁచియున్నావు
గనుక, నీ కాఁకలి - ఘనముగా నుండుఁ;
గావున నిచ్చోటఁ - గల పదార్థములు
నీవ బోసేయుము - నేఁడు సిగ్గేల?
ఎల్లవా రెఱుఁగ నీ-వీడిగ దాని
కల్లుకుండలో మ్రుచ్చు - గతి డాఁగినావు
గాన, మాలిన్యంబు - గల, దది పాయుఁ
బూని మా యెంగి లి - ప్పుడు నీవు గుడువ'
అని భుక్తశేషాన్న - మతఁ డారగించు
కనక పాత్రంబులోఁ - గ్రక్కున వైచె.
శంకరుఁ డది చూచి - సంతసంబంది
పంకజోదరునితోఁ- బలికె నిట్లనుచు:
'తోయజనయన! క్షు - త్తుకుఁ దాళలేక
బోయదా నెంగిలి - బోసేసినావు
కావున దోషంబు - గల, దది పాయ
నీవు నాయెంగిలి - నేఁ డారగించు'
అని హరి పళ్లెర - మందు శంకరుఁడు
తన భుక్తశేషంబుఁ - దప్పక వేసె;

అది చూచి శ్రీ విష్ణుఁ - డానందమొంది
మదనారి నీక్షించి - మగుడి యిట్లనియె:

'పరమేశ! నీ శీల - భావంబు పూర్వ
మరుదుగా బోయ క - న్నప్పకే దెలియు,

ఇపుడు నేఁ జెప్పిన,- నిందున్నవారు
నిపుణత దీపింప - నిన్ను నవ్వెదరు;

తనరార నా సహో-దరినిఁ బార్వతినిఁ
గనుఁగొని కాతు నీ - గౌరవం బిచట'

అని పల్క విని శివుఁ - డంబుజోదరునిఁ
గనుఁగొని పల్కె ను - త్కంఠ నిట్లనుచు:

'జలజాక్ష! వినుము నీ - చపలత్వసరణి
కనుఁగొన గోపసుం - దరులకే దెలియు,

నే నిందుఁ జెప్పిన - నిన్ను నవ్వెదరు
గాన, చెప్పను రమా-కన్యను జూచి,

కాచెద నేఁడు నీ - గౌరవం' బనుచు
సూచింప, హరి హరుఁ - జూచి యిట్లనియె

'నిటలాక్ష! వినుము నీ - నిశ్చలత్వంబు
దిటమైన మోహినీ - దేవికే తెలియు,

చలపాది! నీ కామ - సంకల్ప సరణి
లలిమీఱ బ్రహ్మాదు - లకు నెల్లఁ దెలియుఁ,

జెలఁగి యిందామాటఁ - జెప్పిన నీకుఁ
దలవంపులని నేఁడు - తాళియున్నాఁడ'

అని యిట్లు హరి,హరు - లన్యోన్యముగను
మొనసి భాషింపుచు - మరియు నత్తతిని

అల హరిభక్త శే-షాన్న భక్ష్యములు
చెలువొప్పఁ గైకొని - శీతాద్రి తనుజ

వరుస నచ్చటి పంక్తి - వారి కందఱికిఁ
బరమోత్సవంబునఁ - బంచి వడ్డించి,

### ✳ పార్వతీదేవి మాటకారితనము ✳

సిరి కిట్టు లనియె 'నో - చిగురాకుఁబోఁణి!
శిర మరవాంచి బో - సేయకున్నావు,

చక్కెరపొంగలి, - సకల భక్ష్యములు
మెక్క సంకోచమే - మిటికి? నీ విపుడు

కులుకు ముద్దుల పెండ్లి - కూఁతుర, వీవె
పొలుపొంద నివి యెల్ల - భుజియింపవలయు'

అని నవ్వుచుండఁగా, - నది చూచి యమున
పనిఁబూని హిమశైల - బాల కిట్లనియె:

'ఏమమ్మ! పార్వతి! - యీ పసిబిడ్డ
నీ మాటలన్న ని - న్నెవరు మెచ్చెదరు?
పిన్నది నీవు చె - ప్పిన పదార్థములు
పన్నుగా నొకటైన - భక్షింప లేదు,

మునుకొని బ్రహ్మాండ - ముల నీనినావు;
కనుక నీ కడు పతి - ఘనముగా నుండు.

అటుగాన భక్ష్య భో - జ్యాదు లెన్నైనఁ
పటు తీవ్రముగ నీవు - భక్షింపఁగలవు,

కొంకక నీ విందుఁ - గోరినవెల్ల
నింక వడ్డించెద - నిపు డారగించు.'

అనినఁ బార్వతి నవ్వి - యమున నీక్షించి
యెనలేని ముదముతో - నిట్లని పలికె:

'ఓ యత్తగారు! మీ - కొనరఁ గూఁతురని
పాయక మద్దత్తు - పట్టుగా - జేసి,

బాలిక చిట్లాని, - పాలచట్లాని
పాలు ద్రాగదటంచుఁ - బలికితి రిపుడు,

బాలికయైన యీ - పరమపురుషుని
తాలిమితోఁ గూర్చి - తపమెట్లు చేసె?

పరఁగ మా యన్నయౌ - బ్రహ్మాండమయుని
గుఱుతుగా వలపించు - కొన నెట్లు నేర్చె?

విశదంబుగాను భా - వింప మీ తనయ
పసిబిడ్డ యెట్లగు? - బహు సూత్రధారి,

అది యెట్ల నంటె మ - హా సాత్త్వికులకె
పొదువైన గర్వంబు - పుట్టింప నేర్చుఁ,

గపటంబుతోఁ గాల - గతుల భావించి
యెపుడు పేదలనైన - హెచ్చింప నేర్చు,

మునుకొని హెచ్చించి - మోసంబు చేసి
ధనమదాంధులనైనఁ - దగ్గింప నేర్చు,

నీ పెండ్లి కూఁతురే - యెల్ల జాతులను
చాపల్యము నటించి - చరియింపుచుండుఁ

గావునఁ బసిబిడ్డ - గాదు; మీ మాట
లీ వేళఁ గాదన - నేల? నా కడుపు

గొప్ప యంటిరి, నేను - కోరినవెల్ల
నిప్పుడు [8]వడ్డింపుఁ - దేల దాఁచెదరు?'

అన విని తుంగ భ - ద్రాదులు నగుచు
ఘనపదార్థము లెల్లఁ - గ్రక్కునఁ దెచ్చి

రాసులు వోసి, పా - ర్వతిని వీక్షించి
'బోసేయు' మన, శైల - పుత్రి యిట్లనియె :

'ఒనర వడ్డించితి - రో యత్తగారు!
పనిఁబూని యాఁకలి - పాయునే దీన?

డీకొని మీరు వ - డ్డించిన వెల్లఁ
బ్రాకటంబుగ నొక్క - పంటికి రావు!

పొలుపొంద ననుఁ దృష్టి - పొందితు మనుచుఁ
బలికితి, రదియు ద - బ్బఱ లాయెఁగాని,

8. వడ్డింప కేల దాచెదరు - పూర్వముద్రిత పాఠము.

చెలువొప్ప మా యన్న - శేషాద్రి మీఁదఁ
బులియోగిరము, మంచి - పొంగళ్లు, ఘృతము,

పొసఁగ దధ్యోదనం - బు, బకాళబాతు,
అసమాన రుచి మనో - హరము, లిడ్డెనలు,

అతిరసంబులు, దోసె, - లప్పముల్, వడలు,
ప్రతిలేని శర్కర - పరమాన్నములను

మెచ్చి తా భుజియించు; - మీ యట్టివారు
వచ్చిన, నన్న మ - వారిగా నొసఁగు.

అటువంటి ఘనుఁడు మీ - యల్లుతికంబు
నెటువలె సైరించు? - నిది యేల? చాలుఁ!

బెనుపొంద మీ రింత - పేదవారైతె
ఘనమేమి? మీ రమా - కన్య నెత్తుకొని

వేంకటాద్రికి వచ్చి - వెలయ మా యన్న
కంకితంబుగ వివా - హముఁ జేసి, యచటఁ

గల పదార్థములు మీ - కడుపులు నిండఁ
జెలువంబు నిగుడ బో - సేసి రారాదె?

ఉప్పు కప్పలు, చేఁప - లుండు మీ యింటఁ,
దప్పక ఘనపదా - ర్థంబు లెక్కడివి?

అప్పుడు డంబార్థ - మై మమ్ము నిటకు
రప్పించి కడుపులు - రట్టు చేసితిరి.

పొలుపొంద మీ భక్ష్య - భోజ్యాదు లిపుడు
లలిమీఱ మాకుఁ జా - లవు నిక్కముగను,

పూని మమ్మును దృష్టి - పొందింపలేక
దీనత్వమున నోడి - తిరి మీర' లనిన

## ✳ పరమేశ్వరుని పరియాచకములు ✳

విని నీలకంఠుండు - వికవిక నవ్వి,
తన సతి నీక్షించి - తగ నిట్టు లనియె :

'పార్వతి! మీ యన్న - బ్రహ్మాండకుక్షి,
సర్వభక్షకుఁ డిది - సత్యంబు గనుకఁ

గడుపు నిండదు వంట - కం బెంతయైనఁ,
గడఁకతో జలధికిఁ - గల పదార్థములు

ఉప్పుతో సంతతం - బూరుచున్నట్టి
కప్పలు, చేఁపలు - గలవంటి విపుడు

కావున వారికిఁ - గల పదార్థములె
ఈ వేళ వడ్డింతు - రెన్నేని, నవియు

మెండుగా మీ యన్న - మెక్కినఁ గడుపు
నిండఁ, దక్కినవెల్ల - నీ వారగించు;

తెలియ మీ యన్నకు - శేషాద్రిమీఁదఁ
గలిగియున్నవి వడ్డి - కాసులు గనుకఁ

బేరైన చేరుడు - బియ్య మన్నంబు,
సార మింపుగ లేని - చప్పిడన్నంబు,

కాటువోయిన పంటి - గంజి ప్రసాదంబు
మేటిగా బోసేసి - మెఱయుచునుండు;

అటువంటివారి కీ - యలఘు దివ్యాన్న
మెటువలె సైరించు? - నిది యేల చాలు?

నిప్పుడు మీ యన్న - కిది చాల దంటె
తెప్పింతునా మంచి - తిరుపణా చాఱు?'

అని కేరడముఁ జేసి - నటువంటి విభునిఁ
గనుఁగొని హిమశైల - కన్య యిట్లనియె:

'స్వామి! మా జలజాక్షు - సంపద దెలిసి
యీ మాడ్కి మీ రంటె - నేమి చెప్పుదును?

మా యన్న తిరుపణా - మధు సంతతంబుఁ
బాయక భుజియించు - భక్ష్యాళితోడఁ

దెరఁగొప్ప, నటుగానఁ - దిరుపణాచాఱు
హరికి సహింప ద - య్యది, యైనఁగాని

తెప్పింపుఁ డటువంటి - తిరుపణాచాఱు
మెప్పుగాఁ గ్రోలును - మీ చెల్లె' లనిన,

నగి యిట్లు పలికె నా - నాగకంకణుఁడు:
'నగజ! మా లక్ష్మి ని - ట్లనినందు కిపుడు

సుదతి! మీయన్న చూ - చుచునుండఁగానె
యదె చూడు నీ చెంప - లదర వేసెదను;

సరవి నా చెల్లెలి - సత్కటాక్షమున
నరులలో మీ యన్న - నడిమికి వచ్చె.

అదిగాక, గుణహీనుఁ - డైనట్టివాఁడు
కుదురుగా నేఁటికి - గుణవంతుఁడయ్యెఁ;

జెలఁగి మా చెల్లెలిఁ - జేపట్టెఁ గనుక
వెలయు మీ యన్నకు - విరివింత గలిగె.

అంతకుమున్ను ము - చ్చై డాఁగియుండ
నింతగా మీ యన్న - యెవరికిఁ దెలియు?'

## ✳ స్వామి సరసోక్తులు ✳

అన విని తరిగొండ - హరి మహేశ్వరునిఁ
గనుఁగొని పల్కె ను - త్కంఠ దీపింప

'నందివాహన! నీవు- నా సహోదరిని
మందుఁడవై యున్ని - మాటలాడితివి,

మున్ను నా చెల్లె లి - మ్ముగ నిన్నుఁ గలిసి
మన్నించి నీ కింత - మహిమఁ గల్పించె;

అప్రమాణుఁడవు నీ - వై యుండఁగాను
సప్రమాణునిఁ జేసి - జగతిలో నిలిపె;

అరయ ననాకారి - వై యున్న నీకు
మతి సుందరాకార - మహిమఁ గావించె.

వెలయు మా చెల్లెలు - వీక్షింపకున్నఁ
దెలియునే నీ పర - దేశిత్వ సరణి?

అనఘ! నీ చెల్లెలి - నధికురాలనుచుఁ
దనర నా చెల్లెలిఁ - దక్కువ యనుచుఁ

బలికితి విపు డెంతొ - ప్రౌఢుఁడుగాను,
నెలవొప్ప వినుమైతె- నీ చెల్లి రీతి

నొనర నుండినచోట - నుండక తిరిగి
జనులను వంచించు - చపలాత్మురాలు

కావున మా శైల - కన్యకసాటి
యే విధమునఁ గల్గ, - దీ మాట లేల?

అప్పుడు నీవు నె - య్యంబుతో మాకుఁ 490
దెప్పింతునంటివి - తిరుపణా చాలు

[9]తప్పవ ద్దా మాట, - తనివి దీరఁగను
తెప్పించు, మది యెంత - తెప్పింపఁగలవొ?

నా కదు పందునై -నను నిండకున్న
నీకుఁ [10] జంద్రున కదే - నిపుడు ద్రావింతుఁ,

జల్లని తిరుపణా - చాలు ద్రావుటనె
తొల్లిటినుండి చం - దురునకు, నీకుఁ

దెల్లగా నుండెడి - దేహంబు గలిగె.
కల్లగా దీ మాట - [11]గంజి మీా సొమ్మొ;

9. తప్పక మా కిట - పూర్వముద్రిత పాఠము.

10. జంద్రుని కళ నిపుడు దాగింతు - పూర్వముద్రిత పాఠము.

11. కన్య మీా సొమ్ము - పూర్వముద్రిత పాఠము.

ఇంక మాట్లాడకు - మింతియే చాలు!
శంకర! బోసేయు - సంతసంబుగను'
అని పకపక నవ్వెః - నప్పు డా హరినిఁ

## ✳ సాగరుని సమన్వయము ✳

గనుఁగొని పలికె సా - గరుఁడు నవ్వుచును:
'జలజాక్ష! నీవును, - శర్వాణి విభుఁడు
బలవంతు, లానంద - భరితు, లన్నిటను
ఒక్క రొక్కరికన్న - నుత్తమోత్తములు.
తక్కక మీకు భే - దము లేదు గనుక
మొనసి నవ్వులకు బల్ - ముచ్చట మీఱ
ననుకొంటి రీమాట - లానందమగను.
జలజాక్ష! మితిలేని - జలజజాండములు
పొలుపొంద నెపుడు నీ - బొజ్జలో నుండుఁ
గావున, నీకు నాఁ - కలి దీరఁ దృప్తి
గావింప మే మెంత - గలవార మరయ?
మాకుఁ గల్గిన యంత - మాత్ర మీవేళఁ
జేకొని నీవు భు - జింపవే!' యనిన,
జలజాసనాదు లా - జలరాశి మాట
కలరుచు 'మేలు! మే!'లని మెచ్చి రపుడు.
హరి హరుల్ ముదమంది - యందఱితోడఁ

బొరిఁబొరిఁ దృప్తిగా - భుజియించి లేవఁ,
బరిశుద్ధముగఁ గర - ప్రక్షాళనములు
వెరవొప్ప నయ్యె; నా - వేళ నందతికి,
విలసిత లీలల - విడెము లిప్పించి,
తలకొని యిష్ట క - థా వినోదముల
సలలిత వేంకటా - చల వాసుఁ డనఁగ
నలువొప్పు తరిగొండ - నారసింహుండు
అమిత సంతోష మ - గ్నాత్ముఁడై చెలఁగి
కొమరొప్పఁగా నందుఁ - గొలువు గూర్చుండె.

## ✳ కనక కలశ చౌర్యము - కన్యక అభ్యర్థనము ✳

శ్రీ వేంకటేశుఁ డా - శ్రిత జనావనుఁడు
పావనాచారుఁడు - బ్రహ్మాండమయుఁడు
పన్నగ శయనుండు - భవ విదూరుండు
నన్నేలు తరిగొండ నారసింహుండు
అంత నచ్చట నుండి - హాటకకలశ
మెంతయుఁ బ్రీతితో - నెలమి నెత్తుకొని
వేఱొక్క విడిదికి - వేడ్కతో నరిగె;
నా రీతిఁ దెలిసి గం - గాదు లైనట్టి
సాగరాంగన లెల్ల - సకలోత్సవముల
వేగ శ్రీలక్ష్మిని - వెంటఁ బిల్చుకొని,

వింతగా హరియున్న - విడిదికిఁ బోయి,
సంతోషమున రమా - సతిచేత నపుడు
విహితంబుగా నాది - విష్ణుదేవునకు
రహిని సర్వోపచా - రములు చేయించి,
'పిలువు! నీ పతి' నని - ప్రేరేపఁ, దాను
కిలికించి తాపాంగ - కించిదానమిత
యగుచు నాయకుని మో - మల్లనఁ జూచి
వగ గుల్కఁ బిలిచె న - వ్వనిత యిట్లనుచు :
'జలజాతనయన! నా - స్వామి! యిచ్చటికి
యలిగి వచ్చినదేమి? - యానతీవోయి!
నిపుణత్వ మెఱుఁగక - నే నిందుఁ జేయు
నపచారములకు నీ - వలిగి వచ్చితివొ?
వెలయ మజ్జనకు ని - వ్వేసాలచేత
నళికింపఁదలఁచి నేఁ - డలిగి వచ్చితివొ?
నెట్టన మా తల్లి - నీకు వడ్డించి
నట్టి యన్నము చాల - కలిగి వచ్చితివొ?
ప్రాకటంబుగ సర్వ - భక్ష్యాళి మెక్కి
యాఁకలి దీర కి - ట్లలిగి వచ్చితివొ?
పన్నుగాఁ జెల్లెలౌ - పార్వతి కచట
నన్నంబు చాల కి - ట్లలిగి వచ్చితివొ?

తిరుపణా చాత్రైనఁ - దెప్పింతు ననిన
హరుని వాక్యముల కి - ట్లలిగి వచ్చితివొ?

పేదవారింటిలోఁ - బెండ్లి యాడితిని
ఆదాయమేమని - యలిగి వచ్చితివొ?

అనఘ! 'పెండ్లికి దీసి - నప్పెట్లు దీర్తు?'
నని విచారమున ని - ట్లలిగి వచ్చితివొ?

సొరిదిగా వడ్డి కా - సులు గూడఁబెట్టి,
పరఁగ వరాల నే - ర్పఱుప వచ్చితివొ?

చాల నీ కుపదలు - సమకూర్పఁగలము,
లే! లక్ష్య మేమింక? - లేచి రావోయి!

బుస్సు బుస్సున నల్కఁ - బూని వచ్చితివి;
లెస్సాయె నిఁకఁ జాలు!- లేచి రావోయి!

బాలుని రీతి ని - ర్భంగి నల్గుదురె?
లీలావినోదుఁడై - లేచి రావోయి!

యెలమి మాలోఁ - దప్పు లెన్ని గల్గినను
తొలఁగి రాఁదగునె? ము - ద్దులస్వామి! యిపుడు

అపరాధములు గాచు - నటువంటి నీకుఁ
గపట మేమిటికిఁ? జ - క్కని ముద్దుసామి!

తటుకున వెన్న ము - ద్దలు (మ్రుచ్చిలించి
నటువలెఁ గలశ మిం - దవలీలగాను

చెలఁగుచు నేఁడు ప్రము - చ్చిలి తెచ్చినావు;
వలనొప్ప శివుఁడు న - వ్వఁడె? ముద్దు స్వామి!

మొనసి యీ కలశంబు - ప్రముచ్చిలించుటకుఁ
బనిఁబూని బలు నగుఁ - బాట్లయ్యె ననుచు

సిగ్గుతోఁ బార్వతి - శివుఁజూచి వెఱచి
తగ్గుచున్నది, సహో - దరి దిక్కుఁ జూడు!

శివుఁడు, చంద్రుఁడు నీవు - చేసిన పనికి
నవిరళంబుగఁ జాల - హాస్యంబు చేయఁ

దలఁచుచున్నా, రింక - దయచేసి లేచి
నెళవొప్ప రావోయి! - నీకు మ్రొక్కెదను.

మహనీయ శేష హో - మముఁ జేయవలయు
విహితంబుగా లేచి - వేగ రావోయి!

ఎదురు చూచెదరు బ్ర - హ్మేంద్రాదు లచట
సదమల చరిత! నా - స్వామి! రావోయి!

నలువొప్ప నెట్లైన - నన్ను మన్నించి
సలలిత హృదయ! నా - స్వామి! రావోయి!'

అని యిట్లు ప్రార్థించు - నటువంటి సతినిఁ
గని హరి దరహాస - కలితాస్యుఁడగుచు

నిందిరా కరపద్మ - మింపొందఁ బట్టి,
యందుండి కదలి మ - హావైభవమున

వచ్చి, తత్పూర్వ వి - వాహపీఠమున
హెచ్చుగాఁ గూర్చుండి - యిందిరతోడ
మహనీయ శేష హో - మముఁ జేసి, యపుడు
సహజములై చెల్లు - సకల కృత్యములు
వరుసగా నెఱవేర్చి, - వరలగ్నమందు

## ✳ శ్రీహరి యాహ్వానము - శేషాద్రికిఁ బ్రయాణము ✳

హరి తోయధినిఁ జూచి - యమర నిట్లనియె:
'మామ! సోముఁడు, మీరు, - మా యత్తగారు
శ్రీమహాలక్ష్మినిఁ - జెలఁగి తోడ్కొనుచు
అజ, రుద్ర, నిర్జరేం - ద్రాదులతోడ
భుజగ శైలమున కి - ప్పుడు వచ్చి, యచటఁ
గల విశేషములు మీ - కన్నులఁ జూచి,
యలర మీ సుతను, మ - మ్మాశీర్వదించి,
మగుడి వత్తురు రండి! - మా వెంట' ననిన,
నగజాధిపతిముఖ్యు - లందఱా రీతిఁ
బ్రియముతో 'రండ'ని - పిలువఁగా, జలధి
భయ, భక్తు లెసఁగఁ ద - ప్పక సమ్మతించి,
వివిధ భూషణములు, - వివిధాంబరములు
వివిధంబులగు వస్తు - వితతులు దెచ్చి,
హరికి, రమాకన్య - కపుడు నొప్పించి,

మఱిమఱి సంతోష – మగ్నుఁడై చెలఁగి,
హర, పద్మభవ, నిర్జ – రాదుల, వారి
వరవధూమణులను – వరుసఁ బూజించి,
బహురత్న, భూషణాం – బరము లర్పించి
సహజంబుగాను శ్రీ – సతికి వేడుకను
పరఁగ ముత్యపు టొడిఁ – బ్రాలు గట్టించి,
మురిపెంబు మీఱ నా – ముద్దుపట్టికిని
అరణంబుగాను ది – వ్యాశ్వబృందములఁ,
గరి, రథావళులను, – గల పదార్థముల,
దాస, దాసీ జన – తతులతో నిచ్చి,
వాసుదేవుని వెంట – వచ్చె నత్తఱిని,
అలరార బ్రహ్మ రు – ద్రాదు లందుండి
నలువొప్ప నిజవాహ –నము లెక్కి రపుడు,
సంతోషచిత్తుఁడై – జలజలోచనుఁడు
వింతగా నందఱ – వేడ్కఁ దోడ్కొనుచు
అతివతో గరుడవా – హనముపై నెక్కి
హిత, బంధుజన, పురో – హితులు సేవింపఁ,
దొలఁగక మంగళ – తూర్యముల్ మొరయఁ,
జెలువంబు రెట్టింప – శేషాద్రిఁ జేరి,
సులలితమైనట్టి – శుభలగ్నమందు

వెలయఁగా నగరు ప్ర - వేశించి, యచటఁ
బోఁడిమితో నంతఁ - బురహరాదులకు
వేడుక దీపింప - విందు చేయించి,
పరఁగ శ్రీ పార్వతీ - పరమేశ్వరాది
వరదంపతుల కెల్ల - వరుసగా నపుడు
తనరారఁ జందన - తాంబూలములను,
కనకాంబరములను - గరుణ నిప్పించి,
హరి వీడుకొల్ప, బ్ర - హ్మాదు లందుండి
మురియుచు నిజపురం - బులఁ జేరి; రంత
జలరాశి పైనమై - 'జలజాక్ష! మాకు
సెలవిమ్ము కలుముల - చెలితోడ' ననిన
'నో మామ! మీ కన్య - నొక క్షణంబైన
నీమీఁద విడిచి నే - నిందుండ లేను;
అటుగాన సిరిని నే - నంపఁగాఁ జాల,
నెటులైన నోర్చి నీ - విఁకఁ బోయిరమ్ము'
అని హరి పల్కఁ, జిం - తాక్రాంతుఁడగుచు
వనధి యిట్లనియెను - వనజాక్షుఁ జూచి:

## ✳ సాగరుని సంప్రార్థనము ✳

శ్రీ పన్నగాధీశ! - చిదచిద్ద్వయేశ!
పాపాహి విహగేంద్ర! - పటుకృపాసాంద్ర!

సర్వేశ్వరుఁడ వీవు, - సర్వాత్మ వీవు,
సర్వసాక్షివి నీవు,' - సద్బ్రహ్మ వీవు
కావున, నీ వెఱుం - గని నీతి గలదె?
భావింప శ్రీసతి - ప్రౌఢగా - దిపుడు,
ఈ పసిబిడ్డ నిం - దిరవుగా నుంచి,
యీ పట్లఁ బోను కా - ళ్లెట్లాడు మాకు?
నిపుడె మమ్మెడఁబాసి - యీ చిన్నబాల
నిపుణత్వమున నిందు - నిలువ నెట్లోపు?
మా యింట నాటలే - మరగిన యబల
మీ యింటఁ బనులలో - మెలఁగ నెట్లోపు?
పొసఁగ [12]బ్రహ్మాండ రూ - పున నొప్పు మిమ్ము
విసువక సేవించు- విధము లే మెఱుఁగు?
చాలఁ దల్లులచెంతఁ - జనవుగా నుండు
నీ లేమ భయ భక్తు - లెఱుఁగునే యిపుడు?
కావున దయచేసి - కమల నీ మాటు
మా వెంట నంపవే! - మహితాత్మ!' యనిన,
వనజోదరుఁడు నవ్వి - వకుళ మాలికకుఁ
గనుసన్న చేసి సా - గరు దిక్కుఁ జూపె.

12. బ్రహ్మాండ రూపుని నొప్ప మిమ్ము - పూర్వ ముద్రితపాఠము.

## వకుళమాలిక పలుకులు

వకుళమాలిక హరి - వాంఛితం బెఱిఁగి
యకలంకముగఁ బల్కె - నబ్ధి నీక్షించి:

'జలధి! నీ బహుజన్మ - సంస్కారమహిమ
వలన నియ్యాది దే - వత కూఁతురయ్యె,

వేదాంత వేద్యుఁడై, - విశ్వాత్ముఁడైన
ఆదిమహావిష్ణు - వల్లుఁడై వెలసెఁ;

గావున నీ భాగ్య - గౌరవమహిమ
భావింపఁ దరమె యా - బ్రహ్మకునైన?

నెమ్మది, నటుగాన - నీవు నీ సుతను
సమ్మతి నుంచుమీ! - స్వామి చెంగటను,

అలర మీ కన్న నే - నధికంబుగాను
కలుముల చెలి నిందు - గారవించెదను;

హరికటాక్షము గల్గి - నపుడు మీ సుతకు
గురుసౌఖ్యములకుఁ ద-క్కువ లేదు గనుక,

సంతోషమున రమా - సతిని మా స్వామి
చెంతనే నిల్పుఁడీ! - చింత యేమిటికి?

అనఘ! యీ స్వామి చి - త్తానుగుణ్యముగ
మనకు వర్తించుట - మర్యాద' యనిన,

సాగరుఁ డా మాట - సమ్మతించుకొని
వేగ భార్యలకు న - వ్విధము బోధించి,

## ✳ సముద్రుని హితవచనములు ✳

'అమ్మ! ర' మ్మని సిరి - నంకపీఠమున
నెమ్మదితో నుంచి - నెమ్మోము నిమిరి,

'ఓ యమ్మ! యిచట ని- న్నుంచి పొమ్మనుచు
మా యల్లుఁడైన యీ -మధుసూదనుండు

పలుకుచున్నాఁడు, నీ - పతి యాజ్ఞలోనె
నిలువు నీ విచ్చట-నే సమ్మతమునఁ,

గలకంఠి! నీ పతి - కనుసన్నలోనె
మెలఁగుచు, మాకు నె - మ్మినిఁ గీర్తి దెమ్ము!

వనజాక్షి! యిచ్చట - వకుళ మాలికను
మనము రంజిల్లఁగా - మన్నింపుచుండు!

[13]పతి సేవయందుఁ గో - పము చేసినపుడు
హితవులు చెప్పి, న - వ్వేలమి లాలించు!

పన్నుగా వచ్చిన - భక్త కోటులకు
నన్న పానము లిచ్చి - యపు డాదరించు

అలరి మున్నటిరీతి - నాట్లాడవలదు!
పొలుపొందఁ బెత్తనం - బు వహించియుండు!

పరఁగ నింతైన లో - భగుణంబు లేక
వరము లందఱికి న-వ్వారిగా నిమ్ము!

---

13. పతి సేవ్యుఁ డెపుడు కోపము సేసినపుడు
హితవులు సెప్పి నవ్వేలమిఁ దోఁపించు } పూర్వ ముద్రిత పాఠము

వెలయ నీ పతి యొక - వేళ నవ్వులకుఁ
జెలఁగి తగ్గించి, హె - చ్చించినఁ గాని

కలఁగ కత్తఱినిఁ ద - గ్గక హెచ్చ కెపుడు
పొలుపుగా నొక విధం - బుగ సేవ సేయు!

మకుటిలానందాత్ముఁ - డైనందువలన
నొకవేళ సంతోష - ముప్పొంగఁగాను

నీ పతి పర భామి - నీ సక్తుఁడైనఁ
గోపంబు లేక మ - క్కువను మన్నించు!

మొనర నహంకార - మొకవేళ నయిన
జనియింపనియకు! నీ - స్వాంతంబునందుఁ,

బరఁగఁ గాంతల కెల్లఁ - బతిభక్తి దక్క
నిరతంబు మఱి యొక్క - నియమంబు గలదె?

వరపతివ్రతయైన - వనితకు జగము
కరతలామలకంబు - గాఁ గానవచ్చుఁ,

గావునఁ, బతిభక్తి - ఘనముగా నాత్మ
భావించి, నీవు నీ - పతిఁ గొల్చియుండు.

ఈ పరమాత్మున - కిల్లాలవైన
నీ పుణ్యమహిమ వ - ర్ణింప నా వశమె?

తల్లి! నే నినుఁ గాంచి - ధన్యుండనైతిఁ
జల్లఁగా వర్ధిల్లు! - సర్వకాలంబుఁ

బొలుపొంద, మే మింకఁ - బోయి వచ్చెదము
నిలువు! నీ పతి చెంత - నీవు వేడుకను'

అని బుజ్జగించి, నె - య్యంబు రెట్టింపఁ
దన వధూమణుల నం - దఱఁ జేరఁబిలిచి,

వారిచే శ్రీరమా - వనిత కావేళఁ
గూరిమి బహురత్న - కోటు లిప్పించి,

మురువొప్పఁ గౌస్తుభ - ముఖ్య సన్మణులు
హరికి సమర్పించి, - యతిభక్తిఁ బెంచి

చెలువొప్పఁ జక్రికి - సిరి నొప్పగించి,
బలు జాలిమాలితోఁ - బలికె నిట్లనుచు:

## ✳ సాగరుని మనవి ✳

శ్రీశేషగిరివాస! - చిరదరహాస!
వాసిగా నా మీఁద - వాత్సల్య ముంచి,

పసిబిడ్డయైన నా - పట్టిని నీవు
కుశలంబుగా నేలు - కొనుము! సత్కృపను,

తప్పొప్పులను మీరు - దయతొ మన్నించి,
యుప్పతింపక ప్రోచు - టుచిత మీ సతిని,

నీలనిభాకార! - నీళ్లలో ముంచు,
పాలలో ముంచు నీ - భార మీ మీఁద'

అని యొప్పఁ జెప్పి, చిం - తాక్రాంతుఁడైన
వనధి కిట్లని పల్కె - వాసుదేవుండు :

‘ఓ మామ! మీ పట్టి - నుచితంబుగాను
ప్రేమతో మీరు చె - ప్పిన చందముననె

పరిపాలనముఁ జేతుఁ - బ్రఖ్యాతిమీఱ
నురమునం దిడుకొని - యుందు సంతతము,

స్వాంతంబులో నీవు - సంతసంబందు!
చింతింపవల’దని - చెప్పి, శ్రీసతిని

మన్నించి, కౌస్తుభ - మణితోడ నపుడు
పన్నుగా వక్షంబు - పైన నుంచుకొనె.

అంత సాగరునకు, - నతని భార్యలకు,
సంతోషమెసఁగ నా - [14]జలజాంతకునకు

బహు దివ్య భూషణాం - బరము లిప్పించి,
విహిత సత్కరుణతో - వీడ్కొల్పె, వారు

నిజనివాసముఁ జేరి - నిరతంబు హరిని
భజియింపుచుండి; రా - పద్మాక్షుఁ డిచట

## ✳ శ్రీనివాసుని వైభవము ✳

నెళవుగా నానంద - నిలయంబునందు
వలనొప్పఁగా శ్రీని - వాసాఖ్య నమరి,

అరుదుగా బ్రహ్మోత్స - వాదుల, మఱియు
నిరుపమానములైన - నిత్యోత్సవములఁ

[15]బరమ సంతోషసం - భరితుఁడై, చాలఁ
బరుస నాకర్షించి, - బహుభాగ్యములను

14. జలజాంబకుండు - పూర్వ ముద్రిత పాఠము.
15. పరముఁడు సంతోషభరితుఁడై చాలఁ-పూర్వముద్రిత పాఠము.

వరుసగాఁ గైకొని, - వారికి వివిధ
వరము లిచ్చుచు, మహో - వాత్సల్యమునను

నా పాలి తరిగొండ - నరసింహుఁడగుచు
శ్రీ పన్నగాద్రిపై - స్థిరముగా వెలసి,

నా పెన్నిధానమై - నైజమోక్షంబుఁ
జూపుచు, ననుఁ దన - సొమ్ము చేసికొని,

కుదురుగా నన్నేలు - గురుఁడు తా నగుచు,
ముదమొప్పఁ దత్త్వార్థ - ములను దెల్పుచును,

అలమేలుమంగతో - నానందముగను
సులలితలీలల - సుఖియింపుచుండె.

## ✳ కృతి సమర్పణము ✳

అని యిట్లు శేషాచ - లాధీశుఁడైన
కనకాంబరుని పేరఁ - గమలేశుపేర

వలనొప్పఁగా నంద - వరకులోద్భవుఁడు
చెలువొంద నమల వా - సిష్ఠ గోత్రుండు

వసుధలోఁ గానాల - వంశవర్ధనుఁడు
రసికుఁడౌ కృష్ణార్య - రమణి మంగాంబ

సుత వెంగమాంబ భా - సురభక్తితోడ
ప్రతిలేని శ్రీరమా - పరిణయం బనెడి

వరకృతి ద్విపద కా - వ్యముగా రచించి, 790
నరులెన్నఁ దరిగొండ - నరసింహుఁడైన
సదమల వేంకటా-చలపతి దివ్య
పదయుగళికి సమ - ర్పణముఁ గావించె.
కోరి సుబ్రహ్మణ్య - గురు కటాక్షమున
సారమై యీ కృతి - సార్వకాలంబు
భూచక్రమున మహా - పుణ్యులు చదువ
నా చంద్రతారార్క - మై యుండుఁగాత! 797

# తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.



## శ్రీ వేంకటేశ్వర గో సంరక్షణ ట్రస్టు

(రిజిష్టర్డ్ నెం. 8/2002)

సకల దేవతల మూర్తీ స్వరూపమైన గోమాత హిందువుల ఆరాధ్యదైవం. మానవ జాతి మనుగడ గోమాత యొక్క క్షీరప్రసాదములపై ఆధారపడి వర్ధిల్లుతున్నది. అంతటి మహత్తరమైన గోవును, వాటి సంతతిని రక్షించి, పోషించవలసిన బాధ్యత మనందరిది. తిరుమల తిరుపతి దేవస్థానం తిరుపతిలో నడుపుతున్న శ్రీ వేంకటేశ్వర డైరీ ఫారమ్‌లో గో సంరక్షణకు కావలసిన అన్ని ఏర్పాట్లువున్నాయి. దాదాపు 500 గోవులు ఇందులో వున్నాయి. ఈ గోక్షీరాన్ని తి.తి.దే. ఆలయాలలోని శ్రీవార్లకు కావలసిన అభిషేకము, ప్రసాదాలు తదితరమైనవాటికి ఉపయోగిస్తారు. గోవులను, దాతలు దానం చేసిన గోవులను పరిరక్షించటానికి, పేదరైతులకు దానం చేయడానికి తిరుమల తిరుపతి దేవస్థానముల వారు "శ్రీ వేంకటేశ్వర గో సంరక్షణ ట్రస్టు"ను ఏర్పాటు చేశారు.

1. కామధేనువు: *విరాళము రూ. 5 లక్షలు, అంతకుపైన దాతకు సౌకర్యాలు* ❖ శ్రీవారి మహాప్రసాదము ప్యాకెట్లు - 10 (ఒకసారి) ❖ శ్రీ వేంకటేశ్వరస్వామి శ్రీ పద్మావతి అమ్మవారి బంగారు పూతపూసిన వెండి డాలరు ఒకసారి బహుకరణ. ❖ ప్రతి సంవత్సరము దాతకు ఒక పట్టు ఉత్తరీయము మరియు రవికగుడ్డ. ❖ దాతలు ముందుగా తెలియపరిస్తే గోకులాష్టమి రోజున తిరుపతి ఎస్.వి. డైరీఫారమ్‌లో గోపూజ సందర్భంగా వారికి పట్టు ఉత్తరీయం, రవికగుడ్డతో ఉచిత రీతిన సత్కారం. ❖ సంవత్సరమునకు ఒకసారి 5 గురికి మించకుండ వైకుంఠం క్యూ కాంప్లెక్స్ సెల్లారు ద్వారా ఉచితంగా శ్రీవారి దర్శనము. ❖ దాత కుటుంబ సభ్యులకు ఐదుగురికి మించకుండా సం॥లో ఒకసారి ఉచితముగా 3 రోజులు సాధారణ వసతి ఏర్పాటు లేదా చెల్లింపుతో వి.ఐ.పి. వసతి. ❖ సం॥లో దాత కోరిన శుక్రవారము ఐదు లీటర్ల ఆవుపాలు దాతపేరుతో శ్రీవారి పాలాభిషేకమునకు పంపుతారు. ❖ దాత పేరు తిరుపతిలోని శ్రీవేంకటేశ్వర గో సంరక్షణ శాలయందు ప్రదర్శిస్తారు. ఈ సౌకర్యాలు దాతకు జీవిత పర్యంతము, ఇద్దరు దాతలు, ఫర్ములు అయితే 20 సం॥లు వుంటాయి.

2. క్షీర సాగరం: *విరాళము రూ. 1 లక్ష నుండి 5 లక్షల లోపు దాతలకు సౌకర్యాలు* ❖ శ్రీవారి మహాప్రసాదము ప్యాకెట్లు - 5 ❖ దాతలు ముందుగా తెలియపరిస్తే గోకులాష్టమి రోజున తిరుపతి ఎస్.వి. డైరీఫారమ్‌లో గోపూజ సందర్భంగా వారికి పట్టు ఉత్తరీయం, రవికగుడ్డతో ఉచిత రీతిన సత్కారం. ❖ 5 గురికి వైకుంఠం సెల్లారుద్వారా ఒకసారి ఉచితంగా శ్రీవారి దర్శనం. ❖ సం॥లో దాత కోరిన శుక్రవారము ఒక లీటరు ఆవుపాలు దాతపేరుతో శ్రీవారి పాలాభిషేకమునకు పంపుతారు. ❖ దాతపేరు తిరుపతిలోని శ్రీవేంకటేశ్వర గో సంరక్షణశాలయందు ప్రదర్శిస్తారు.

3. బృందావనం: *విరాళము రూ. 10 వేలు నుండి రూ. 1 లక్ష లోపు దాతలకు సౌకర్యాలు* ❖ శ్రీవారి మహాప్రసాదము ప్యాకెట్లు - 2 ❖ సంవత్సరములో దాత కోరిన శుక్రవారము ఒక లీటరు ఆవుపాలు దాత పేరుతో శ్రీవారి పాలాభిషేకమునకు పంపుతారు.

4. గోపాల: *విరాళము రూ. వెయ్యి నుండి రూ. 10 వేలు లోపు దాతలకు సౌకర్యాలు* ❖ శ్రీవారి మహాప్రసాదము ప్యాకెట్టు ఒకటి

పై విరాళాలన్నింటికి 1961 ఐ.టి. యాక్ట్ సెక్షన్ 80 జి (5) (vi) ప్రకారం ఆదాయపు పన్ను రాయితీ లభిస్తుంది. మీ విరాళాలు కార్యనిర్వహణాధికారి, తి.తి.దేవస్థానములు, తిరుపతి వారి పేరున డి.డి. తీసి ఆ డి.డి.ని డైరక్టరు, ఎస్.వి. డైరీఫారమ్, తిరుపతికి పంపాలి. ఫోన్: 0877-2248140

Published by Sri A.P.V.N. Sarma, I.A.S., Executive Officer
T.T.Devasthanams and Printed at Sri Parasaraya Press, Sri Vyasasramam.